శ్రీః

మహాకవి కాళిదాస ప్రణీతః

# రఘువంశః

ద్వితీయః సర్గః
పఞ్చికా సంజీవనీ టీకా ద్వయోపేతః
తైలఙ్గీమృణాళినీ టీకా సహితః చ



ప్రకాశకులు
**RAVI MOHAN RAO,** M.Sc., M.A. (Sanskrit)
Flat No. 404, Janajanam Complex, Opp. 1 Town Police Station,
CHIRALA - 523155
Cell :**94401 15411**



శ్రీః

మహాకవి కాళిదాస ప్రణీతః

## రఘువంశః

ద్వితీయః సర్గః
పఞ్చికా సంజీవనీ టీకా ద్వయోపేతః
తైలఙ్గీమృణాళినీ టీకా సహితః చ

**ప్రథమముద్రణ : మహాశివరాత్రి 27-02-2014**
**ప్రతులు : 500**
**పేజీలు : 256**
**వెల రూ. : 200/-**



D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

## పీఠిక

మహాకవి కాళిదాస ప్రణీతమైన రఘువంశకావ్యము ద్వితీయ సర్గము, రామోరా విరచిత మృణాళినీ వ్యాఖ్యా సహిత మీ గ్రంథము. కాగా కవి కాళిదాసుని గురించియు, వాని కావ్యముల గురించియు, దాని వ్యాఖ్యాతల గురించియు, రఘువంశకావ్యమును గురించియు సంగ్రహముగ కొంత తెలిసికొనుట సముచితము. అట్టి ప్రయత్నమే ఈ పీఠిక.

### 1.జానపదకాళిదాసుడు

కాళిదాసుని పేరైన వినని, వాని కవిత్వమహత్వమును గూర్చిన కథ నొకటియైన వినని భారతీయుడు ఉండడేమో! ఆతడు జన్మతః నిరక్షరకుక్షియైన ఒక సాధారణ జానపదుడనియు, శ్రీకాళీమాతకృపచే సకలవిద్యాపారంగతుడైన మహాకవి యాయెననియు నొక కథ ప్రసిద్ధము. వానికి ఈ పేరు ఈ కారణమున లభించినదే తప్ప తల్లితండ్రు లే పేరుపెట్టిరో తెలియదు.

ఈ కవి ధారానగరము నేలిన భోజుని ఆస్థానమున నుండెనని, పెక్కు కథలున్నవి. ఒకనాడు రాజు ఆస్థానములో, **కమలే కమలోత్పత్తిః శ్రూయతే న తు దృశ్యతే,** అని మిన్నకుండగా కాళిదాసుడు, **బాలే తవ ముఖాంభోజే దృష్టమిందీవరద్వయమ్,** అని పూరించి ఒక చక్కని అర్థమును ప్రతిపాదించెనని ఒక కథ. నిరుపేదబ్రాహ్మణులిద్దఱు భోజుని కీర్తిని విని, తమకు భుక్తికి లోటులేకుండ అనుగ్రహించునను ఆశతో ధారా నగరమునుచేరగా, రాజు కవి పండితపక్షపాతియే కాని నిరక్షరకుక్షుల కిచ్చువాడు కాదని పౌరులనుండి తెలిసికొని, ఏమి చేయుదుమా యని విచారించి, ఆరాత్రి నగరము చివర గల కాళికాలయమున విశ్రమించి వేకువనే తిరిగి పోదమని నిశ్చయించి, అట తలవాల్చి యుండగా, వానిలో నొకడు, ఒక్క శ్లోకమునైనచెప్పి తమ కోరికను విన్నవించిన రాజా నుగ్రహము లభించునను ఆశ కలిగి, ప్రయత్నించి, **భోజనం దేహి రాజేన్ద్ర** అని శ్లోకము నారంభించి ఆపై ఏమియు తోచకుండగా, రెండవవాడు కొంత ఆలోచించి, **ఘృతసూపసమన్వితమ్,** అనుచు పూర్వార్ధమును పూరించెనట.ఆపై శ్లోకము నెట్లు ముగించవలెనో తెలియక వారు ఆలోచనామగ్నులై మిన్నకుండిరి. గ్రామాంతరము వెళ్ళి వచ్చుచు కాళిని దర్శించ వచ్చి, ఈ బ్రాహ్మణుల కృత్యాద్యవస్థను గమనించిన కాళిదాసుడు, **మాహిషం చ శరచ్చన్ద్రచన్ద్రికాధవళం దధి,** అని ఆ శ్లోక ఉత్తరార్ధమును పూర్తిచేసి, అయ్యా! శ్లోకము పూర్తియైనది. రాజుగారికి విన్నవించుడు. పప్పునెయ్యితో తమకు కమ్మని పెరుగన్నము కూడ లభించును లెండని చెప్పి కదలిపోయెనట. మరునాడీ





శ్లోకమును విని మహారాజు, శ్లోక ఉత్తరార్ధమునకు మెచ్చి అగ్రహారము నిచ్చెనట. ఇది ఒక జానపదగాథ.

ఏదో ఒక కారణమున కాళిదాసునిపై కోపించి, రాజాతనికి రాజ్య బహిష్కారమును విధించి, తరువాత తన పొరపాటును గ్రహించి, కాళిదాసుని వెదకికొనుచు రాజే స్వయముగ మారువేషమున సంచరించుచు, ఒక బాటసారిని కలిసికొని, ప్రసంగవశమున ఆ బాటసారి, అయ్యా ! మహారాజు క్షేమమా? అని అడుగగా, ఆఁ ఏమి క్షేమము లెండి? అనుచూ, **అద్య ధారా నిరాధారా నిరాలంబా సరస్వతీ,** అని నిట్టూర్చెనట. అది వినిన కాళిదాసుడు అమంగళము ప్రతిహతమగుగాక! యని, **ధ్రువం ధారా సదాధారా సదాలంబా సరస్వతీ। రాజతే యత్ర భోజోఽద్య కాళిదాసాభిసేవితః॥** అనెనట. ఆతడు కాళిదాసుడే యని గ్రహించిన భోజుడు , వానిని వీడ్కొని ధారానగరమును చేరెనని మఱియొక గాథ

కవిగా కాళిదాసుని ప్రతిష్ఠను దెలుపు కథయొకటి ప్రసిద్ధము. ఎన్నదగిన కవులను లెక్కించునపుడు మొదటిపేరు కాళిదాసుడుకాగా, రెండవస్థానమున కర్హుని గానక, ఆ వ్రేలును వదిలి మిగత కవులను లెక్కించిరట, అందుకే చిటెకెన వ్రేలు తరువాత అనామికా యనుట:

**పురా కవీనాం గణనప్రసంగే–కనిష్ఠికాధిష్ఠితకాళిదాసా।** అద్యాయపి తత్తుల్యకవేరభావా – దనామికా సార్థవతీ బభూవ॥ మఱియొకప్పుడు కవులలో నిజమైన కవి ఎవరను ప్రశ్న రాగా, కవులందఱును కాళికాలయమున కేగి ఆ దేవతనే అడిగిరట. అప్పు డామె, **కవిర్దణ్డీ కవిర్దణ్డీ కవిర్దణ్డీ న సంశయః,** అని ముమ్మాటికీ కవి దణ్డియే యని సెలవివ్వగా, కాళిదాసుడావేశమున, **కోఽహం రండే!** అని అంకె వేసెనట. దాని కా తల్లి ప్రసన్నముగ, **త్వమేవాహం త్వమేవాహం త్వమేవాహం న సంశయః,** అని ముమ్మాటికీ కాళిదాసుడు తన అభిన్నరూపమే యని చెప్పినదట. ఇది యొక గాథ.

ఇట్టి జానపదగాథలవలన తెలయవచ్చినది కాక చారిత్రకమైన ఆధారములతో ఈ మహాకవిని గురించి తెలియవచ్చినది చాల తక్కువ. కాళిదాసప్రణీతములుగ లభించిన రచనలన్నియు ఒకే వ్యక్తి రచనలా కాదా? అను ప్రశ్నకు కాదనియే పండితాభిప్రాయము. కానిచో, పెక్కురు కాళిదాసులుండి రనవలెను కదా! ఐన వారిలో నెవనిని మహాకవి కాళిదాసుడని నిశ్చయింపవచ్చును? అనగా, లభించిన వానిలోనుండి మహాకావ్యములను వేరుపరచి, లక్షణసామ్యమును పరిశీలించి, వానిలో ప్రసక్తములైన చారిత్రకాంశములను సరిచూచి, నిశ్చయించవలసి యుండును. ఈ పద్ధతియైన నిస్సంశయముగా నిర్దోష మనుటకు వీలులేదు. మరి, అన్యథా శరణం నాస్తి.

## 2. చారిత్రక కాళిదాసుడు

సాంప్రదాయిక చరిత్రకారులు మహాకవి కాళిదాసుని ఉజ్జయిని నేలిన విక్రమాదిత్యుని ఆస్థానకవిగా పేర్కొందురు. ఈ రాజు శకకర్త. ఈ శకారంభము క్రీ.పూ. 57లో జరిగినదని నిర్ణయము. ఈ చారిత్రక సందర్భము నుల్లేఖించునదే కాళిదాసుని విక్రమోర్వశీయ నాటకమని ఒక అభిప్రాయము. ఈ నాటకమున నాయకునకు పురూరవుడని కవి నామకరణము చేసి తరువాత విక్రముడని పేరు మార్చెననియు, ఇది పై అంశమునకు ప్రోద్బలకమనియు వారందురు. కాళిదాసుడు అగ్నిమిత్రుడను క్రీ.పూ. 150 కాలపు విదిశరాజునకు సమకాలీనుడని అభిప్రాయమున్నది. ఈ రాజు కాళిదాసుని మాళవికాగ్నిమిత్రము అను నాటకమున నాయకుడు. ఈతని ప్రసక్తి కాళిదాసుని మేఘదూతకావ్యమున గూడ కన్పడును.

క్రీ.శ. 634 కు చెందిన ఐహోల్ శాసనము కాళిదాసుని మహాకవిగా గుర్తించినది . కనుక కాళిదాసుడు క్రీస్తు పూర్వము 150- క్రీ. శ. 634 మధ్య కాలమునకు చెందియుండవచ్చునని ఒక అభిప్రాయము. క్రీ.శ. 473కు చెందిన మాండసోర్ శాసనము కాళిదాసుని రచనలను గుర్తించినదని కొందఱందురు. దీని నంగీకరించినచో, కాళిదాసుడు క్రీ.శ. 4వ శతాబ్దికి తరువాతివాడనుట కుదరదు.

ఇదిట్లుండ, అశ్వఘోషుని బుద్ధచరితకును కాళిదాసుని కావ్యములకును కొంత సామ్యమున్నదని పలువురు పండితులంగీకరించిన దానింబట్టి, అశ్వఘోషుడు కాళిదాసునుండి స్వీకరించినట్లయిన, కాళిదాసుడు తప్పక క్రీ.శ. 1 వ శతాబ్దికి పూర్వుడనియు, కాక కాళిదాసుడే అశ్వఘోషునుండి గ్రహించినచో, ఈ మహాకవి క్రీ.శ. 1వ శతాబ్ది తరువాతివాడై యుండుననియు సిద్ధాంతమగు చున్నది.

కాళిదాసుడు 2వ చంద్రగుప్తుని కాలమువాడని ఒక వాదము. ఈ చంద్రగుప్తునకు విక్రమాదిత్యుడను బిరుదునామమున్నది. ఈతడు క్రీ.శ.345-414 మధ్యకాలమున పాలించెను. యస్.వి.సోహోనీగారి పరిశోధనల సారము: కాళిదాసుడొక బ్రాహ్మణునకు వైశ్యకాంతయందు జన్మించినవాడు. వీని నాల్గవయేట వీని తండ్రి వీనిని, తల్లిని విడిచి ఎటో పోయెను. తల్లి చెంత పెరిగి, వైశ్యుల పాఠశాలలో చేరి చక్కగా సంస్కృతభాషను, తర్కవ్యాకరణవేదాంతఛందోఽలంకారశాస్త్రము లందును మరెన్నియో శాస్త్రములందును కళలందును మహాపండితుడాయెను. యౌవనమురాగా, జీవికకై తన గురువుగారి పలుకుబడితో నాటి రాజాస్థానమున సూతప్రముఖు నాశ్రయించి సూతనవకుడై, సూతుడై, క్రమముగ కవిగా రాజు నాకర్షించి, రాజాజ్ఞపై మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయ, అభిజ్ఞానశాకున్తలములను నాటకత్రయమును రచించి, రాజగు కుమారగుప్తుని ఆస్థానకవి





యాయెను. ఆపై ఈర్ష్యాళువైన సూతప్రముఖుని ఆంతర్యము నెఱుగక వాని సూచనమేరకు మహాకావ్యముగ కుమారసంభవమును రచించుచు, పార్వతీకళ్యాణానంతరకథయైన 8వ సర్గలో, ఆ సూతప్రముఖుని సూచనను నమ్మి, పార్వతీశ్వర సంభోగవర్ణనము చేయగా, ఆతడు దానిని మహాదోషముగ రాజునకు విన్నవించి, కాళిదాసుని సంవత్సరకాలము రాజ్యబహిష్కృతుని చేయించెనట. ఆ కాలమున కాళిదాసుడు మేఘదూతమను కావ్యమును వ్రాసి దాని ప్రతిని చక్రవర్తికి పంపగా నాతడా కవిత్వమునకు పులకించి, మరల ఆ కవిని పిలిపించి, రఘువంశము నితివృత్తముగా జేసికొని ఒక మహాకావ్యమును వ్రాయుమని ఆజ్ఞాపించెనట. అట్లే, కుమారసంభవరచనను నిలిపివేయుమని ఆ రాజు ఆజ్ఞాపించెనట.-- ఈ కథ ఐదు శతాబ్దముల క్రిందట 6వ పరాక్రమబాహుడను సింహళరాజు పూర్వపు శాసనములో చొప్పింపజేసిన శాసనభాగముగా లభించినది. ఈ శాసనభాగమునకు **కాళిదాసవృత్తాన్తః** అను శీర్షికను గూడ అమరించినాడా సింహళరాజు.

ఈ కాళిదాసవృత్తాన్తమువలన కాళిదాసుని జీవితవిశేషముల సాధికారత ఎట్లైనను, కాళిదాసమహాకవి రచనలుగా శ్రవ్యకావ్యత్రయము (కుమారసంభవ, మేఘదూత, రఘువంశములు), దృశ్యకావ్యత్రయమును(మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయ, అభిజ్ఞానశాకున్తలములు) పండితులంగీకరించిన వానికి కొంత అధికారముద్ర పడినట్లయినది.

ఇవికాక,శ్యామలాదండకము,ఋతుసంహారము, వసంతతిలకము అనునవి కూడా కాళిదాసకృతములుగనే చెల్లుచున్నవి.

ప్రాచీనగ్రంథముల విషయమున, తప్పో ఒప్పో ఒక నిర్ణయము లేకున్నచో అధ్యయనము సాగదు. కవియొక్క దేశకాలాది పరిజ్ఞానమువలన కవి వ్యక్తిత్వవికాస చరిత్రము కొంత తెలియవచ్చును. తత్తత్కావ్యవ్యాఖ్యాతల పరిశ్రమమునకు దిశానిర్దేశము లభించును. కేవలము కావ్యరసానందము నపేక్షించు చదువరుల ఈ వివాదములు, చర్చలు, వృథా కాలయాపనగ తోచవచ్చును, కాని, ఒక మహాప్రజ్ఞాశాలిని లోకమెంతగ ఆరాధించునో ఈ జానపద, చారిత్రకాంశముల వలన తెలియుచున్నది.

## 3. కావ్యకాళిదాసుడు

వ్యక్తి కొంత బహిరంగమున , కొంత అంతరంగమున జీవించును. వాని రూపగుణవర్తనములు బహిరంగము. వాని ఊహలు, ఆలోచనలు, ఆశలు, ఆశయములు వాని ఆంతరంగికజీవితము. సమకాలీనులకివి రెండును కొంత ప్రత్యక్షము కొంత పరోక్షము. కాని తరువాతి తరములవారికి రెండును పరోక్షపరోక్షములే. వాని కావ్యవ్యక్తి

తప్పు సాకారసగుణకవివ్యక్తి తెలియదు. ఈ కావ్యరూపకాళిదాసుడే జగమెఱిగినవాడు. ఆతడు రసస్వరూపి, ఆనందరూపి. వీనిని దర్శించుటలో సైతము దర్శించు వ్యక్తి వ్యక్తిత్వము ప్రధానము,గణనీయము. ఐనను వాని అవగాహనకాధారము కావ్యమున్నది, కనుక వ్యాఖ్యాతదర్శనము నేలవిడిచి సాము కాదు. వ్యాఖ్యానభేదము లెన్నియున్నను, పర్యవసానమున కావ్యమానందదాయి. కాళిదాసుడు ఏమో వ్రాయుట, దానిని చదివి మన మీనాడు పరవశించుట! ఇదెట్లు సంభవము. బ్రహ్మానందసహోదరము కావ్యానందమనుట కిదే కారణము.

కాళిదాసుని కావ్యముల ఇతివృత్తములు దేశీయవాఙ్మయమునుండి గ్రహింపబడినవి. వాని నాటకములు మూటికి మూడున్ను శ్రవ్యకావ్యములు మూడింట రెండున్ను ప్రేమయే ప్రధానవస్తువుగానున్నవి. రెండు నాటకములున్ను రెండు శ్రవ్యములున్ను పురాణ ప్రసిద్ధకథలు, పాత్రలు ప్రధానముగ నున్నవి. ఒక నాటకమున్ను ఒక శ్రవ్యకావ్యమున్ను కాళిదాసుని కల్పనలు. వీనిలో, నాటకమున నాయకుడు చరిత్రకు తెలిసిన రాజు. శ్రవ్యకావ్యమున నాయకుడు దేవయోనులలోవాడైన యక్షుడు. కాళిదాసుని రచనలుగనే చెల్లుచున్న శ్యామలాదండకము దేవీస్తుతి;ఋతుసంహారము వర్ణనాత్మకరచన; శృంగార తిలకము చిన్న ముక్తకకావ్యము. ఇదియు ప్రేమ ప్రధానమైనదే. ఋతు సంహారమున శృంగార స్పర్శ లేకపోలేదు.

లోకము సత్త్వరజస్తమోగుణముల స్పన్దనప్రతిస్పన్దనలతో ఈ జగన్నాటక మేర్పడుచున్నది. మరియు నానారసమయమైనది. కనుక నాటకమైనను, నాట్యమైనను, గానమైనను, కవిత్వమైనను, ఏ సాహిత్యప్రక్రియయైనను ఈ సహజసిద్ధములైన నానా రసములలో దేనినైన ఒక దానిని స్వీకరించి, అది కేంద్రకముగ రూపము దాల్చవలెను. అనగా, అది వాస్తవమునకు అద్దము పట్టవలెను. ఐనను, లోకచరిత్ర ఇట్లున్నదని ప్రదర్శించుచునే, అది ఎట్లుండుట శ్రేయస్కరమో దానిని సూచించుట కవికి సిద్ధమైన సాధ్యమాన బాధ్యత. దీనిని కాళిదాసుడు గుర్తించి స్వీకరించెను. ఈ లక్ష్యముతో తన కావ్యపాత్రలను కొంత సంస్కరించెను. ప్రపంచప్రఖ్యాతమైన కాళిదాసుని అభిజ్ఞానశాకున్తల నాటకమే ఉదాహరణ. మూలమున శకున్తల తన లాభనష్టములను లెక్కకట్టికొని ప్రవర్తించు ఒక సాధారణ లౌకిక యువతి కాగా, కాళిదాసుని నాయిక ఒక పవిత్రమైన ప్రేమపూర్ణురాలు. అట్లే, మూలమున దుష్యన్తుడొక స్వార్థపరుడైన కాముకుడు కాగా, కాళిదాసుని నాయకుడు శాపగ్రస్తుడైన మహోదాత్తుడు. మేఘదూతమున యక్షుడు తన ప్రియురాలికి సందేశము పంపుటకు మేఘముతో తన గోడు చెప్పికొనుట, మేఘమార్గమును నిర్దేశించుట, ఇత్యాదులు అసంబద్ధములను ప్రవాదమున్నది. దానికి





కాళిదాసుడు, **కామార్తా హి ప్రకృతికృపణాశ్చేత నాచేతనేషు,** అని సమర్థించుకొనినాడు.

కాళిదాసునకు సమకాలీన శాస్త్రపరిజ్ఞానమున్నదనుటకు వాని కావ్యములలోని న్యాయశాస్త్ర, మత ధార్మికక్రియాకలాపముల ప్రసక్తి, విభిన్న వేదాన్తతత్త్వశాస్త్రశాఖా విషయప్రసంగములే సాక్షి. ఆతడు జన్మతః యే ప్రాంతమువాడో తెలియదు కాని ఆసేతుహిమాచలమునకును, మానవజీవనవైభవమునకును ఈ మహాకవి హృదయ స్పన్దనకు వాని కావ్యవ్యక్తి యొక అభివ్యక్తి యనవచ్చును. వాని వ్యక్తిత్వమున వినయముతో కలగలసి ఆత్మవిశ్వాసము ద్యోతకమగును.

ధ్వని, ప్రసాదగుణము, తౌల్యము, మాధుర్యము, సౌకుమార్యము, ఔదార్యము, స్పష్టత, భావుకత, పదప్రయోగౌచిత్యము, భావార్థసంయోగము, ఇత్యాది గుణములతో కాళిదాసుని కవిత్వము పరిపుష్టము. ఈ కవి పదప్రయోగమున పొదుపరి.వాని కావ్యములలో శబ్దార్థముల పొందిక పులకింపజేయును. వాని పదచిత్రములు, భావచిత్రములు సరళసుందరశిల్పములు. పురాణగాథలను సందర్భోచితముగ ప్రస్తావించుట వాని ప్రత్యేకత. ఇక అలంకారముల విషయమున,

**శ్లో॥ ఉపమా కాళిదాసస్య భారవేరర్థగౌరవమ్।**
**దణ్డినః పదలాలిత్యం మాఘే సన్తి త్రయో గుణాః॥**

అనే నానుడి ఉండనే యున్నది. ఉపమయే కాళిదాసుని ప్రధానమైన కావ్యలక్షణమనగా, ఉపమను కాళిదాసుడు అలంకారప్రాయముగ కాక మహార్థప్రతిపాదకముగ ప్రయోగించునని భావము. ఉపమ వాని కవిత్వజీవలక్షణము. రఘువంశమహాకావ్యాది శ్లోకమున **వాగర్థావివ సంపృక్తౌ** అనునది కేవలమొక ఉపమానము కాదు. వాక్కు శరీరమై, అర్థము ఆత్మయైన జీవునకు పరమార్థము శివసంయోగమనుటయే. ఇదియే ఈ మహాకవి పొందగోరిన **వాగర్థప్రతిపత్తి.** ఇది కేవలము శబ్దార్థముల సంబంధము కాదు. పార్వతి ప్రకృతి, వాగ్రూపి. శివుడు తదాత్మ, పురుషుడు, అర్థరూపుడు. శివశక్తుల ప్రకృతిపురుషుల కలయిక జగత్తు. కనుకనే వారిని **జగతః పితరౌ** అనుట. ఈ జగత్పితృత్వమే పరమార్థము. ఈ సత్యదర్శనమును తాను పొంది, తన కావ్యమూలమున ప్రదర్శించుటే కవిగా తన పరమావధి యని సూత్రీకరించునదే ఈ శ్లోకము. ఇట్లే మాలోపమలను ప్రదర్శించు నపుడును, ప్రతి పోలికలోను ఒక ప్రత్యేకవిశేషార్థస్ఫూర్తి ఉద్దిష్టము. కాళిదాసుని భారతీయాత్మ కెత్తిన పతాక వాని ఉపమ.

కాళిదాసుని కవిత్వముపై భారతీయత ముద్రింపబడియున్నది. భౌతిక ఆధ్యాత్మికముల కలగలుపే భారతీయ జీవనాదర్శము, జీవనవిధానము. నియమబద్ధత, విశ్వప్రేమ,మోక్షము అను ఈ ఆశయత్రయము భారతీయుల జీవనసరళిలో, కోరికలలో,

ఆశలలో, కలలలో, జయాపజయములలో, ఈ ప్రపంచమున ఇమిడి పోవుటకు చేయు ప్రయత్నములన్నిట వానిని నడిపించు జీవనసూత్రము. ఈ ఆదర్శమే కాళిదాసుని కావ్యసందేశము. ఇదియే వాని రఘువంశమహాకావ్యమునకు ఆత్మ.

ఈనాటి హిందూమతమే కాళిదాసు డామోదించి అనుసరించిన మతధర్మమనుట కంటె ఈనాడు మసకబారిన సనాతనధర్మమే వాని మతమనుట న్యాయము. ఈ కవి రచనలందంతయు ఆర్షత్వము, బ్రహ్మీభూతత్వము, ఆత్మికజీవనమునందనురక్తి, ప్రయత్నము ఇత్యాది వ్యాప్తమై కన్పించును. వాని ఆదర్శము దేశకాలాది అవధుల కావల, రాగవిరాగాది ద్వన్ద్వముల నధిగమించి, వైయక్తికమైన భిన్నత్వముల కేంద్రమున అఖండమై వెలుగు పరమసత్యమును దర్శించి జీవించుట. రఘువంశము, 18వ సర్గ, 28వ శ్లోకమున కాళిదాసు డిట్లనును: **స బ్రహ్మభూయం గతిమాజగామ**. అనగా, ఆతడు బ్రహ్మమయమైన లక్ష్యమును చేరికొనెను., అని . ఇదియే సనాతనధర్మమునకు జీవనావధి.

కాళిదాసుడు శివభక్తుడు, శివపక్షపాతి యను నానుడి కాధారము వాని నాటకము లందన్నిటను రఘువంశాదియును శివప్రార్థనమే ఉండుట. ఐనను ఆతడంతమాత్రమున శైవుడనుట తగదు. ఉపాసనకాధారముగ నాతడు శివమూర్తిని స్వీకరించి యుండవచ్చును. ఐనను భావమున వానికి సంకుచితత్వము లేదు. త్రిమూర్తులలో నాతడు న్యూనాధిక్యములను భావించలేదు. రఘువంశాది శ్లోకమును గాంచిన, **వాగర్థావివ** అనుటలోనే వాగ్దేవియైన సరస్వతిని తత్ప్రాణమైన బ్రహ్మను దర్శించినాడు. **పార్వతీపమేశ్వరౌ** అన్నప్పుడు **పార్వతీప-రమేశ్వరౌ** అనగా పార్వతీపతిని శివుని, రమానాథుని కేశవుని గూడ పార్వతీపరమేశ్వరులలో దర్శించినాడు. వీరి మూడు మూర్తులలోని ఐక్యతను **సంపృక్తౌ** అనుట ప్రకటించుచున్నది. కాగా ఈ ముప్వరును ప్రకృతిలోని వారే, వాగ్రూపులే. వారి కర్థము పరమార్థమైన సచ్చిదానన్దపరబ్రహ్మమే అనుట ఉపనిషణ్మత సత్యమే. రఘువంశమున విష్ణుస్తోత్రమునగాని, కుమారసంభవమున బ్రహ్మస్తోత్రముగాని ఈ మహాకవి ఆరాధించినది త్రిమూర్తితత్త్వములకు మూలతత్త్వమైన పరబ్రహ్మమునే. **ఏకైవమూర్తిర్బిభిదే త్రిధాసౌ**, ఒకే మూర్తి మూడుగనైనది. **(కు.సం.7.44), నమస్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్ సృష్టేః కేవలాత్మనే। గుణత్రయవిభాగాయ పశ్చాద్భేదముపేయుషే॥** సృష్టికి పూర్వము కేవలాత్మవై గుణత్రయవిభాగముచేత భిన్నమూర్తులుగలవాడవైన నీకు నమస్కారము**(కు.సం.2.1),** అనుటలో కాలిదాసుని మతము వేదాంతమతమని సిద్ధము. మానవుని జీవనపరమావధియేమో ఆతడీ శ్లోకమున సూటిగనే చెప్పెను. **తమసః పరమాపదవ్యయం పురుషం యోగసమాధినా రఘుః॥**





**(ర.వం.7.24)** కాలిదాసుడు తత్త్వతః స్త్రీకంటె పురుషుడధికుడని భావించలేదు. **స్త్రీపుంసావాత్మభాగౌ తే (కు.సం.2.2),** స్త్రీపురుషులు నీ ఆత్మలోని భాగములు, లేక, నీ ఆత్మయొక్క భాగములు. సనాతనధర్మమున నిదియు నంతర్భాగమే.

అవ్యయుడైన ఆ పరమపురుషుని చేరునంతవరకు మరల మరల పుట్టుట గిట్టుట తప్పదని కాలిదాసుడు నమ్మెను. ఈ పరిణామమున కర్మ తోడ్పడును. కావున కర్మ తప్పదు. దానిని యోగబుద్ధితో చేయుచు, భక్తిమార్గముననుసరించుటే మహాజ్ఞానమను గీతమతమే కాలిదాసుని మతము.

కాలిదాసుని రచనలలో విషాదాంత మొక్కటియు లేదు. అందులకు కారణము జీవితమును నడిపించు నైతికశక్తి పర్యవసానమున పూర్ణత్వము నందించునదియే. అనగా ఆనందమునకు చేర్చునదియే. కనుక జీవితము, లౌకికవృత్తముగ నెంచి చూచిన దుఃఖమయముగ తోచినను, ప్రాపంచికతకు ఆధ్యాత్మికతను జోడించి చూచినప్పుడు దుఃఖము జీవుని పరిణామములో ప్రాస్తావికమే తప్ప పరమము చరమము కాదనునది సనాతనదర్శనము. దీనిని సమర్ధించునవే పురాణగాథలందలి లోకకంటకులైన రాక్షసుల చరిత్రలు. వీరు దేహాంతమున ఆ పరమాత్మతేజస్సులో లీనమగుదురు. ఈ విషయమున తపోనిష్ఠులగు మహర్షులకేది అంత్యప్రాప్యమో తపోభంగము జేయు దుష్టచరితులకును అదే చరమగతి. ఇట్లు కాలిదాసుని మతము ఉపనిషణ్మతమనుటే న్యాయము. సంకుచితమైన శైవమో శాక్తేయమో వైష్ణవమో వేరొకటియో కాదు.

భారతీయులు దేశకాలాతీతవిషయములను భావించినంతగా ప్రాపంచిక విషయములకు విలువనివ్వరని ఒక అభిప్రాయమున్నది. వీరు ఆముష్మికమును గురించి అధికశ్రద్ధతో విచారింతురనుట సత్యమే. ఈ లక్ష్యసిద్ధికై వీరు ప్రాపంచిక జీవితమును క్రమబద్ధము చేసి, లక్ష్యము దృష్టిపథమునుండి తొలగిపోకుండుటకే పరిపరివిధములుగా ఐహిక-ఆముష్మికముల విడదీయరాని సంబంధమును, అందలి సమగ్రతను గుర్తుచేసికొనుచుందురు. ఈ ప్రణాలికలో భాగమైనవే ఆశ్రమధర్మములు, పురుషార్థములు. జీవితమున ప్రతివస్తువునకు, ప్రతిస్థితికి, ప్రతి అనుభవమునకు ఒక నియతమైన సమయము, విలువ కలవని భారతీయసనాతనవిశ్వాసము. ఈ నమ్మకమే బ్రహ్మచర్య, గార్హపత్య, వానప్రస్థ, సన్న్యాసాది ఆశ్రమధర్మాచరణమునకును, ధర్మ-అర్థ-కామ-మోక్ష పురుషార్థచతుష్కపాలనమునకును భారతీయుని ప్రోత్సహించును. ఇది ఐహికనిరాకరణము కాదు. ఆముష్మికమునకు యోగ్యముగ ఐహికమును సంస్కరించుకొను ప్రయత్నము. మానవునకు జీవితమును రుచికరముగ, అనుభవయోగ్యముగ చేయునవి నైతిక, ఆర్థిక,కలాత్మక, ఆధ్యాత్మికవైఖరులు. జీవితమును జీవికిని, వాని సమాజమునకును

ప్రయోజనకారిగా చేయునది ఈ నాలుగపేటల సూత్రము. దీనిని ప్రిదిలిపోకుండ ఎడనెడ సంస్కరించి, ప్రభావంతము చేయుట కవికి కర్తవ్యముగ భావింపబడిన కాలమువాడు కాలిదాసుడు. వాని దృష్టిలో మతము, నైతికత అనునవి ప్రగతికి, సంక్షేమమునకు విరోధులు కావు, నిరోధకములు కావు. అర్థకామములకు ధర్మము రక్ష, మోక్షము గమ్యము. **అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మ ఏవ మనీషిణః (ర.వం1.25)** మానవజీవితమున దేని స్థానమేదియో, ప్రయోజనమెట్టిదో నిర్ద్వంద్వముగ ప్రకటించు ఈ రఘువంశప్రథమసర్గములోని 7,8 శ్లోకములు పరిశీలింపదగినవి.

**శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్।**
**యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్॥**

**శ్లో॥ శైశవే ఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్।**
**వార్ధకే మునివృత్తీనాం యోగేనాన్తే తనుత్యజామ్॥**

సమాజమున సంపన్నులు, దరిద్రులు అను రెండు తెగలవారు ఎప్పుడైన ఉండక తప్పదు కదా. కారణములను చర్చించి, దరిద్రులనుద్ధరించు ప్రయత్నము జరుగవలసినదే. అట్టి ప్రయత్నములు ఎనలేని సంపదలను సద్వినియోగపఱచవలెననుదే **త్యాగాయ** అనుట. ఈ బాధ్యతను సంపన్నులు మరువకుండిరేని దారిద్ర్యము బహులజనబాధకము కాదు., నేరప్రవృత్తికి పంటపొలమును కాదు. సత్యమునే పలుకువానికి వాచాలతతో పనిలేదు. ఇది వాచిక తపస్సు. ఈ శుద్ధిలేకున్న, అబద్ధప్రచారములు, అసంబద్ధ ప్రలాపములు మెండై సమాజమున శాన్తి సుఖము లోపించును. సత్కీర్తి కొరకే విజయకాంక్ష. ఈ కీర్తి వ్యక్తిని సమాజశ్రేష్ఠుని జేయును. ఇది పొరుగు రాజ్యములను జయించు విషయము కాదు. పర్వతాధిరోహణము, అంతరిక్షయానము, వివిధశాస్త్రముల పరిశోధనాఫలితముగ నిత్యనూతనజ్ఞానావిష్కరణము, ఇవన్నియు **యశసే విజిగీషూణాం** అను దానిలో అంతర్వర్తులే. ఇది అర్థము విషయము. కామము విషయమున, ప్రకృతి కామమును వంశవృద్ధి కొరకేర్పరచినది.బుద్ధిజీవియైన మానవుడు ఈ ధర్మమును గౌరవించకున్న, విశృంఖలత్వము సమాజమును దైహికముగ, మానసికముగ బలహీనముచేసి మృత్యుమార్గమునకు లాగును. ప్రగతి సర్వత్ర కుంటుబడును. గృహస్థాశ్రమమునకు లక్ష్యము సంతానోత్పత్తి మాత్రమే, విశృంఖలశృంగారము కాదు. గృహస్థాశ్రమమునకు కామకేళీవిలాసమునకు వివాహబంధమున్నది. ధనార్జన కవసరము కలుగుట సంసారికే. కాని అర్థకామములు ధర్మబద్ధములై నియంత్రితములుగ ఉండవలెను. బాల్యము విద్యార్జనకు తగిన సమయము. మనసు ఏకాగ్రమై ఉండవలెను గాని బహువ్యాపి కారాదు. వార్ధక్యము రాగా, మానవుడు మునియై జీవించవలె,





వానప్రస్థుడు కావలె. తన సంతానము విద్యాధికులై, వివేకవంతులై తమ గృహస్థ ధర్మములను పాలించు సమర్థులైన వెనుక, వృద్ధులు పెత్తనము చేయుచు ఇంకను సంసారిధర్మము లనువర్తించుట కుటుంబజీవితమునకు చేటుదెచ్చును. అట్లు మునివృత్తులైన వారు, చివరకు యోగమార్గమున, అనగా ఇంద్రియమనోబుద్ధులను పరమాత్మానందమున ఏకాగ్రతతో సంధించి ఐచ్ఛికముగ, ఆనందముగ శరీరమును విడువవలె. ఇది సనాతన భారతీయ జీవన ప్రణాళిక. దీనియందొక క్రమము, పరిణతి కన్పించును. ఇది సనాతనమైన ఆర్షసమాజమునకు సమగ్రస్వరూపము. త్యాగమే సర్వత్ర పరమసూత్రము. అనగా, జీవితమును యే ఆకర్షణలు నిర్వీర్యము చేసి ప్రగతిని నిరోధించునో వానిని త్యజించవలె. త్యాగము ఇచట ఒకానొక సృజనాత్మక ధర్మము. కనుకే సర్వమును త్యజించిన సన్న్యాసులకు ఈ సమాజమున అత్యంత గౌరవమున్నది. శాకుంతలము ద్వితీయాంకమున 7వ శ్లోకమున, **శమప్రధానేషు తపోధనేషు గూఢం హి దాహాత్మకమస్తి తేజః,** శమము ప్రధానమైన తపోధనులలో రహస్యముగ ఒక దాహకశక్తియైన తేజస్సు ఉన్నది, అనుటకీ విశ్వాసమే మూలము.

స్త్రీ ప్రకృతి స్వరూపిణి, ఆమె సౌందర్యము కవులలోని శిల్పకళా వైదుష్యమున కొక గొప్ప ఆకర్షణగా నిలచును. మహాకవి కాళిదాసుడు మంత్రముగ్ధుడు కాకుండునా? కుమారసంభవకావ్యమున పార్వతి యౌవన ప్రసంగముననేమి, విక్రమోర్వశీయమున ఊర్వశి వర్ణనలోనేమి, మాళవికాగ్నిమిత్రమున మాళవిక వర్ణనలోనేమి, మేఘదూతమున యక్షుడు తన భార్యను వర్ణించిన తీరులోనేమి స్త్రీయౌవనాకర్షణను పురుషదృష్టితో చూచి పులకించిన అంగాంగ వర్ణనయే కానవచ్చును. పాఠకునికివి కొంత అతిగా తోచవచ్చును. కాని కవి శిల్పి, సౌందర్యోపాసకుడు. శృంగారదృష్టితో కాక మాతృభావనతోనైనను సాక్షాత్ సరస్వతీమూర్తిని వర్ణించు సందర్భములోనైనను, **సంగీతమపి సాహిత్యం సరస్వత్యాఃస్తనద్వయమ్,** అనియు, **కాటుకకంటి నీరు చనుకట్టుపయింబడనేల యేడ్చెదో,** అనియు ఆ తల్లి పాలు త్రాగిన పసివాడైనను స్తనములను తాకకుండుట కవికి సాధ్యమా? పురుషుని పుట్టుక, సుఖము, శాంతి, సమస్తము స్త్రీమూలమే కనుక ఆ మూర్తిపై ఆ గౌరవమే వానిలోని కళాత్మకతకు ప్రేరణయని భావించి తప్పులెన్నకుండుట న్యాయము. పురుషాకృతిని వర్ణించునప్పుడు ఆజానుభాహువనియు, అరవిందదళాయతాక్షుడనియు, విశాలవక్షుడనియు, ఎగుభుజములవాడనియు, దృఢజంఘుడనియు, కవయిత్రియైన వర్ణించును కదా. ఇట్టిపట్టుల కవియైనను కవయిత్రియైనను తన స్త్రీపురుషప్రకృతుల నుండి కాక దార్శనికప్రవృత్తినుండి చూచుననుకొనుట సరి.

స్త్రీపురుషప్రేమ కాళిదాసుని గాఢముగ ఆకర్షించినది. దీనిని చిత్రించు పట్టులందు తన ఉత్సాహమును, కల్పనాచాతుర్యమును ఉదారముగ వినియోగించెను. ప్రేమలో అనుభవమునకు వచ్చు ఛాయలన్నింటిని తన కావ్యములలో ప్రదర్శించెను. సౌందర్యాస్వాదన విషయమున, ప్రేమాస్వాదన విషయమున, కాళిదాసుడు తన చుట్టు కంచెవేసికొని కూర్చుండ లేదు. ఎ.డబ్ల్యూ.రైడర్ మహాశయుడన్నట్లు, కాళిదాసుడొక ఉదాత్తదైవీవైఖరి నవలంబించి, ఇంద్రియములను మనస్సును అమలిన సౌందర్యదర్శనానందమున కాయత్తపఱచెను. ఈతడారాధించినది దైహికసౌందర్యమును మాత్రమే కాదు, భావనాసౌందర్యమును, వ్యక్తిత్వసౌందర్యమును కూడ.

కాళిదాసుని కావ్యప్రపంచమున పురుషులు చలచిత్తులు, మందులు. వాని స్త్రీపాత్రలలో ఒక కాలాతీత విశ్వజనీనశీలము చదువరి నాకర్షించును. జర్మనీదేశీయుడైన గెటె (Goethe) మహాశయుడు అభిజ్ఞానశాకున్తలములోని శకుంతలను దర్శించి పరవశించి,

Wouldst thou the young year's blossoms and the fruits of its decline
And all by which the soul is charmed, enraptured, feasted, fed?
Wouldst thou the earth and heaven itself in one sole name combine?
I name thee, O Sakuntala! and all at once is said.

అని గానము చేసెను. కాళిదాసుని స్త్రీమూర్తి భారతీయసంప్రదాయమునకు కాణాచి. క్రమబద్ధత, అన్యోన్యత అను గుణములే వారిపై గల ఈ గౌరవమునకు మూలము.

కాళిదాసుని కావ్యప్రపంచమున ప్రత్యక్షమగునదియును ఈనాటి పురుషాధిక్య ప్రపంచమే. ఈ ప్రపంచము వారిది గావున పురుషులు స్త్రీల విషయమున నిర్భీకులు, స్వతంత్రులు, విశృంఖలులు. బహుభార్యాత్వమును వారు సహజసూత్రముగనంగీకరించిరి. కాని కాళిదాసుని స్త్రీలు పురుషులవలె చపలచిత్తులు కారు, విశ్వసనీయులు, ప్రేమపూర్ణులు. ఐనను సున్నితమైన మనస్సు గలవారు, ఊహలు కలవారు, అర్థజ్ఞానము కలవారు. కనుకే వారిలో అనిశ్చితి, సంశయము కలుగుట కద్దు. నాటి సమాజమాశించిన కట్టుబాట్లను, సాంప్రదాయికనియమావళిని వారు ఎదుర్కొను సందర్భములున్నవి.

మాళవికాగ్నిమిత్రమున ధారిణి, ఐరావతి, మాళవిక, కౌశికి ప్రధాన స్త్రీ పాత్రలు, వీరు నల్వురు నాల్గువిధములు. పట్టపురాణి ధారిణి, పేరుకు తగినట్లుగనే, సహనశీలి. తన భర్త అన్యస్త్రీలయందనురక్తుడైనను భరించి గంభీరముగ వ్యవహరించును. భర్తలోని స్త్రీలాలసను సున్నితముగ మందలించును. **యది రాజకార్యేష్వపి ఈదృశీ ఉపాయనిపుణతా ఆర్యపుత్రస్య తతః శోభనం భవేత్।** కాని ఆమెకు భర్తయందనురాగము ఎంత మాత్రము





సడలక నిల్చియుండును. కాని ఐరావతి సందేహశీలి. దురుసుతనము, ఉద్రేకపడు నైజము, నియంతృలక్షణము గల వ్యక్తిత్వమామెది. అగ్నిమిత్రుడు మాలవికయందాసక్తుడై తనను విడిచినప్పుడు ఐరావతిలో ఈ లక్షణము బహిర్గతమగును. **అహో! అవినీతహృదయోఽయం ఆర్యపుత్రః।...శఠ! అవిశ్వసనీయహృదయోఽసి।** ఈ ఇద్దరి కంటె భిన్నమైనది మాలవిక. ముగ్ధసుందరి. ఇక కౌశికి కష్టములకు రోసి బౌద్ధభిక్షుకియైనది. ఈమె నాట్యచతుర.

విక్రమోర్వశీయమున ఔశీనరి పాత్ర ఒక హైందవసాంప్రదాయికభార్యామూర్తికి సజీవప్రమాణమనదగి యున్నది. తన భర్త సంతోషమునకై తన సుఖసంతోషములను పరిత్యజించినదామె. విదూషకుడన్నట్లు ఆమె వైఖరి **అభావే విరక్తిః** అనరానిది. ఆమెయే విస్పష్టముగ ఇట్లనును - **అహం ఖల్వాత్మనః సుఖావసానేన ఆర్యపుత్రం నిర్వృతశరీరం కర్తుమిచ్ఛామి.** ఆమె తన భర్తకు ప్రియురాలైన ఊర్వశితో స్నేహభావమున మెలగును. రవంతైన ఈసు జెందదు. ఊర్వశిమాత్రము ప్రేమ విషయమున స్వార్థపరురాలు, అసూయ గలది. పుడమితల్లి ఒడిలో పెరిగిన ఔశీనరి ఔదార్యము! స్వర్గమున చిరనివాసమున్న దేవకాంతయైన ఊర్వశి ఈర్ష్యాస్వార్థములు! ఎవరు మానవులు! ఎవరు దేవకాంతలు!

శాకున్తలమున ప్రేమ మొగ్గవేసి విప్పారి కాయగాచి పండగుట చిత్రించబడినది. దైహికాకర్షణమూలముగ మొగ్గతొడిగిన దుష్యన్తుని ప్రేమ నైతిక ఆధ్యాత్మికశీలమును సంతరించుకొని భూమిని స్వర్గముగ మార్చును. శకున్తల తన తల్లియైన మేనక సౌందర్యమును ఔల్లాసికశీలమును గుత్తగొని, తన తండ్రియైన విశ్వామిత్రుని సహనమును. క్షమను, ఆర్షప్రేమభావమును వారసత్వముగ చేకొన్నది. స్వేచ్ఛానియతుల సంగమరూపమే శకున్తల. కాళిదాసుని దృష్టిలో, యువతీయువకుల ప్రథమప్రేమోద్విగ్నత నేరమో పాపమో కాదు, కాని ఇంద్రియాకర్షణమే ప్రేమయను భావమునుండి తప్పులై వారు సత్యమైన ప్రేమను సాక్షాత్కరించికొనవలె, అనునది సిద్ధాన్తము. శకున్తలయు పార్వతియు ఇట్లు తప్పులైన వారే.

కాలిదాసుని మతమున సంభోగశృంగారము నింద్యము కాదు., ఆధ్యాత్మికసాధనలకు విరోధియు గాదు. కట్టుబాటులేని జీవితము, అదుపులేని భావతీవ్రత మాత్రమే ఆత్మకు విరోధి. స్త్రీపురుషలైంగికప్రేమ హద్దులెఱిగి న్యాయబద్ధమై ప్రవర్తించినప్పుడది ఆధ్యాత్మికశీలమును సంతరించుకొనును. సంసారిగ నుండియు సన్న్యాసిశీలమున జీవించగల్గును. **త్యక్తేన భుంజీథాః** అని కదా వేదోక్తి. ఆనందమే జీవితమునకు పరమావధి. అది అమలినము, పవిత్రము కావలయును. ఇంద్రియలాలస, దైహికసుఖముకొరకే జీవించుట అనర్థము. భార్య సహధర్మచారిణి, సాంఘికసంక్షేమమునకు మూలము. ఆమె

భర్త ఆస్తి కాదు, పురుషుని పూర్ణునిజేయు ప్రేమస్వరూపిణి. పురుషుని జీవనసూత్రబంధము. స్త్రీపురుషునకు తల్లి, వాని బిడ్డలకును తల్లి. కనుకే భార్యకు జాయా అని మరియొక పేరు. వీరి బంధమునకు అర్థము, సాఫల్యస్వరూపము సంతానము. **ప్రజాయై గృహమేధినామ్** అనునది కాలిదాసోక్తి.

రఘువంశమున కౌటుంబిక జీవితమునకు సజీవసంకేతము సుదక్షిణాదిలీపుల దాంపత్యము. రాముని ఏకపత్నీత్వము పరమము. కాలిదాసునిమతమున, సమగ్రవ్యక్తి వికాసమే వివేకజీవనమునకు లక్ష్యము. కౌటుంబికజీవిత మీ లక్ష్యమును సిద్ధింపజేయు భూమిక. ఆశ్రమవ్యవస్థకిదియే పరమప్రయోజనము. ఈ వైఖరిని భగవద్గీత బలముగ సమర్థించును.

### 4. కాలిదాసుని ప్రకృతిప్రియత్వము

కవులు ప్రకృతిప్రియులనుట సహజోక్తి. మానవుని రూపము, మనుగడ, సర్వము ప్రకృతిలో వ్రేళ్ళూని యున్నవి. ప్రకృతి నిబద్ధించినదే వాని జీవనలయ. కాలిదాసుడును అందరివలె ప్రకృతి నారాధించువాడే. ఐనను వాని వైఖరి ఒక సంప్రదాయమో, కవిలాంఛనమో కానిది- కేవలం వ్యక్తినిష్ఠముకాదు, ప్రకృతి అందములకు వాని ఇంద్రియస్పందన కాదు, క్షణికావేశము కాదు. ఇది ఆత్మికబంధము, ఆర్షమైన ఆత్మీయత.

కాలిదాసుని కావ్యములలోని పాత్రలన్నియు ప్రకృతితో సమైక్యమై జీవించు హృదయసౌకుమార్యము గలిగియున్నవే. వృక్షములు, పశుపక్ష్యాదులు, నదీపర్వతములు వీనితో సోదరభావమున తమ ఉనికిని, సుఖదుఃఖములను అనుదినము, క్షణక్షణము పంచికొనుచు జీవించునవే. వాని ఋతుసంహారకావ్యము సైతము కేవలము ప్రకృతి ధర్మముగ వచ్చిపోవు మార్పుల వర్ణనము కాదు. మానవజీవితముతో గాఢముగ పెనవేసికొని చరాచరప్రకృతి సంతరించికొనిన ఒక అపూర్వమానవీయత వర్ణనమది. - మానవుని కోరికలకు, నానాటి మనఃస్థితులకు ప్రతిబింబము. ఈ వైఖరియే వాని దృశ్యకావ్యములందును సుస్పష్టము. శకున్తల కణ్వాశ్రమవృక్షములకు జంతువులకు చేయు సేవ, **న కేవలం తాత నియోగః। అస్తి మమాపి సోదరస్నేహ ఏతేషు,** తండ్రిగారి మాట పాటించుటకే కాదు, నాకును వీనియందు సోదరభావమున్నది, అని శకున్తలయే ప్రకటించును. ఈమె మాటలను సమర్థించుచు కణ్వు డిట్లనును:

శ్లో॥ **పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా**
**నాదత్తే ప్రియమణ్డనాపి భవతాం స్నేహేన యా పల్లవమ్।**
**ఆద్యే వః కుసుమప్రసూతిసమయే యస్యా భవత్యుత్సవః**
**సేయం యాతి శకున్తలా పతిగృహం సర్వైరనుజ్ఞాయతామ్॥**



అనగా, మీకు నీరుపోయకముందుగా తాను నీరు త్రాగనిది, తాను ఎంతయో అలంకారప్రియయైనను మీపై మమకారమువలన పూలు త్రుంచనిది, మీరు తొలిపూలు పూయగా మహదానందమున పొంగిపోవునది, ఈ శకుంతల పతిగృహమునకు పోవుచున్నది. మీరందఱు ఆమెకు అనుజ్ఞనిత్తురుగాక!, అని. ప్రకృతిని కణ్వుడుగాని శకుంతలగాని ఒక నిర్జీవ పదార్థముగనో తమకుపకరించు వస్తువులుగనో వ్యాపార వ్యవహార సరళిలో మూల్యాంకనము చేయలేదు. తమ ఇంటి పెద్దలుగ, ఆత్మీయులుగ గౌరవించిరి. ఇట్టిదే **రఘువంశము (14.69)**లోని సీతాక్రందనమునకు ప్రకృతి ప్రతిస్పందన:

శ్లో॥ **నృత్యం మయూరాః కుసుమాని వృక్షాః**
**దర్భానుపాత్తాన్విజహుర్హరిణ్యః।**
**తస్యాః ప్రపన్నే సమదుఃఖభావ-**
**మత్యన్తమాసీద్రుదితం వనేఽపి॥**

అనగా, నెమళ్ళు తమ నాట్యమును తటాలున ఆపి నిలిచినవి; నోటిలోని దర్భలను విడిచి లేళ్ళు నోళ్ళు తెరిచినవి; వృక్షములు పూవులను రాల్చినవి: సీత దుఃఖముతో సమాన దుఃఖమును ప్రకటించుచు ఆ అడవియంతయు రోదనధ్వనితో నిండిపోయినది, అని అర్థం.

ఇది ఆర్షానుభవము. నిజమునకు, ప్రతి జీవి పుట్టుకకు, మనుగడకు, సుఖదుఃఖములకు ప్రకృతిస్పందన లేకున్న, మానవుడెంత బుద్ధిజీవియైనను మనగలుగునా? స్పందన-ప్రతిస్పందనల రూపమే ప్రకృతి. ఈ దార్శనికతయే ఆర్షత్వము. కాళిదాసుని గాఢముగ హత్తుకొనినదీ ఆర్షదర్శనమే. వాని ప్రకృతి పరిజ్ఞానము సునిశితము. వాని వర్ణనలు, ప్రకృతితో వానిసహస్పందనలు, ప్రాకృతికమైన దృశ్యశబ్దస్పర్శాది అనుభవములు, వాని కల్పనాచేతనలో పునరుజ్జీవితములైన కవిబ్రహ్మ సృష్టిసత్యములు. వాని హిమాద్రి వర్ణనలు, గంగాసంగీత తరంగములు, అన్నియు మానుషములే. ప్రపంచమనగా మానవుడొక్కడు కాదు, వాని ఒక్కనికొరకే ఉద్దేశింపబడలేదు. ప్రకృతి ఆరాధనయనునది ఒక తాత్త్వికభావన, ఒక ప్రేమానుభవము, ఒక ఐక్యతానుభూతి. ఇదికాళిదాసుని వైఖరి.

### 5. కాళిదాసుని వ్యాఖ్యాతలు

**వల్లభదేవుడు :**

కవుల విషయమున ఎట్లో వ్యాఖ్యాతల విషయముననను అట్లే వివాదములకు, అభిప్రాయభేదములకు తావున్నది. ఎంతయో పరిశోధన జరిగినను, చాలా వివరములు

స్పష్టము కావలసియున్నవనగా మరింత పరిశోధనావశ్యకత ఉండనే ఉన్నది. కాళిదాసుని వ్యాఖ్యాతలలో మొదటివాడు వల్లభదేవుడనవచ్చును. వీనికంటె ముందు ప్రకాశవర్షుడని ఒకరున్నట్లు సూచనలున్నవి. వల్లభదేవుడే ఈ ప్రకాశవర్షుని ప్రస్తావించెననుటయు కద్దు. ఐనను వానిని గురించి తగినంతగా తెలియరానందున, వల్లభదేవుడే తొలి వ్యాఖ్యాత. అసలు వ్యాఖ్యాన ప్రక్రియకే ఆద్యుడనియు ఒక అభిప్రాయమున్నది.

ఈ వల్లభదేవుడు క్రీ.శ. 10వ శతాబ్దారంభమున తన వ్యాఖ్యలను రచించి యుండవచ్చును. ఈతడు తన తండ్రి ఆనందదేవుడని చెప్పికొని యున్నాడు, కాని తన సంతానమును గురించి, మనుమలను గురించి ప్రస్తావించనే లేదు. కైయటుడను నాతడు వల్లభదేవునకు చంద్రాదిత్యుడను కుమారుడును, ఆనందవర్ధనుడను మనుమడును ఉన్నట్లును, ఆ మనుమడు దేవీశతకము అనుదానిని రచించినట్టును పేర్కొనెను.

ఈ వివాదములటుండ, కాళిదాసుని కావ్యములను మొదటగా వ్యాఖ్యానించినవాడు వల్లభదేవుడనుట నిస్సంశయము. కాళిదాసుని కావ్యత్రయము నాతడు వ్యాఖ్యానించెను. లభించిన వ్యాఖ్యాప్రతులు నిర్వివాదములు కావు. ద్వివిధములుగను త్రివిధములుగను ఉన్నవి. బహుశః దీనికొక కారణము వేదాంతపురాణగ్రంథ వ్యాఖ్యానములపై గల శ్రద్ధ కావ్యవ్యాఖ్యానములపట్ల లేకపోవుట. వ్యాఖ్యావిస్తృతిలో కొన్ని పాఠములు లఘువులు, కొన్ని గురువులు. విస్తృత వ్యాఖ్యలను పఠించినవారు వానికి సంక్షిప్త పాఠములను వ్రాసియుండుటవలన లఘుపాఠము లేర్పడియుండవచ్చును. మరియొక విధమున, లఘువ్యాఖ్యానములకే పండిత-పాఠకులు కొన్ని వివరముల నధికముగ చేర్చి విస్తృతపాఠములను నిర్మించియుండవచ్చును. ఇంతకు, వల్లభదేవుని వ్యాఖ్యానశైలి ఎట్టిది?

సాంప్రదాయికముగ వ్యాఖ్యానమునకు ఐదు అవయవములుండవలయు నందురు:

**శ్లో॥ పదచ్ఛేదోఽన్వయోక్తిశ్చ సమాసాదివివేచనమ్।**
**పదార్థబోధస్తాత్పర్యం వ్యాఖ్యావయవపంచకమ్॥**

అనగా, 1.పదవిభాగము, 2.అన్వయక్రమము, 3.సమాసాదుల వివరణము, 4.ప్రతిపదార్థము, 5.తాత్పర్యము, అను ఈ అయిదును వ్యాఖ్యకు అవయవములు, అని భావము. ఇందు **సమాసాది** అనుదానిలో **ఆది** శబ్దార్థమున సంధి, అలంకారములు, ఛందస్సు ఇమిడి యున్నవనవచ్చును. ఇవే కాక మరెన్ని అంశములనైన, పూర్వగాథా వివరణము, ఔచిత్యచర్చ, ఇత్యాదులను వ్యాఖ్యలో చేర్చికొనవచ్చును. **ఆది** శబ్దార్థము అంతము లేనంత కదా!

దీనింబట్టి వల్లభదేవుని వ్యాఖ్యానమున ఈ అంశములన్నియు ఉండునను భావము





కలుగుట సహజము. అదిగాక తన వ్యాఖ్యకాతడు **పంచికా** యను పేరుంచినాడు. ఇదియు పాఠకునకాశ కలిగించునదే. కాని, వాని వ్యాఖ్యలను పరిశీలించిన, అవి నిజమునకు మూలశ్లోకపాఠమునకు వచన రూపములుగా తోచును. వాని వ్యాఖ్యానశైలి కిదియే మూల సూత్రము. ఐనను, కొన్ని శ్లోకములకు విస్తృత వ్యాఖ్యలును కన్పించు చున్నవి. రఘువంశము, సర్గ1, శ్లో.1 ఒక ఉదాహరణము. వల్లభదేవుని వ్యాఖ్యానపద్ధతిలో మరియొక విశేషము: పదములకు అర్థములనిచ్చునప్పుడు, మూలమున ప్రయుక్తమైన పదముకంటెను తక్కువ ప్రాచుర్యముగల పదములనిచ్చుట. అట్లే, వ్యాకరణ సూత్రములను సైతము చెప్పక విడచుట ప్రత్యేకము. అన్యగ్రంథములనుట్టంకించునప్పుడును, శ్లోకపాఠములను అసంపూర్ణముగ చెప్పి విడచుటయు ఒక ప్రత్యేక లక్షణమా అనిపించును. వాని దృష్టిలో, కాళిదాసుని కావ్యములను, తన వ్యాఖ్యలను చదువువారందఱును **టీకా విరహఖేదార్తసాధుసార్థప్రవర్తితులు.** కనుక వారందఱు అమరకోశమును, అష్టాధ్యాయిని అధ్యయనము చేసిన పండితులే. తాను చెప్పక విడచిన అంశములు వారెఱిగినవే కనుక అసౌకర్యము కలుగదని వాని ఉద్దేశమేమో! వల్లభదేవుని అలంకారశాస్త్రవైదుష్యమునకు గూడ నిదర్శనములు లభించవు. శ్లోకార్థనిర్ణయము విషయమున వాని పరిశీలనలు కొన్నిట అసాధారణమనిపించును. దీనికంతకును ముఖ్యకారణము వల్లభదేవుని పాండిత్యమును కనరానీయని వినయశీలముండుట. నిశితదృష్టికి వాని ప్రతిభావ్యుత్పత్తులు కన్పడకపోవు. ఐనను, దోషములను నిష్కర్షగ దోషములుగా ప్రకటించుటకు ఆతడు వెనుకాడడు. అట్లే, కొన్ని తావుల అపాణినీయ ప్రయోగములను సమర్థించుట కూడా.

మనకు లభించిన వల్లభదేవుని వ్యాఖ్యానపాఠములు, మార్పులు చేర్పులు లేకుండ, వ్యాఖ్యాత వ్రాసినదే యథాతథముగ నున్నవని చెప్పలేము. లేఖకుల చేతులలోబడి, వారి వారి అలవాట్లు కారణముగా, మూలపాఠము ఎంతగా భ్రష్టమై ఉండునో ఊహించుటయు కష్టమే. లేఖకుల వలన మార్పులు, చేర్పులు పదునొకండు విధముల కలుగుటకవకాశమున్నదని గుర్తించబడినది. అవి ఇవి: 1)ప్రతీకలను చేర్చుట, 2)మూలపాఠములోని పదములను మార్చి పర్యాయపదములను వ్రాయుట, 3) సమాసములను మూలమునకు విరుద్ధముగ విఱిచి చెప్పుట, 4)వాక్యార్థములను సుబోధము చేయు నెపమున మూలపాఠములో లేని పదములను చొప్పించుట, 5)లేని అవ్యయములను చేర్చుట, 6)వాడుకలో అరుదైన పదములున్నచోట తరచు వాడుకలో కన్పించువానిని వ్రాయుట, 7)పాఠాంతరములను, మూలమున లేనివానిని, చేర్చుట, 8) వ్యాఖ్యాత ఉదహరించిన పాఠాంతరములలో ప్రసిద్ధములైనవానిని మూలపాఠముగా గ్రహించి వ్రాసికొనుట, 9)వ్యాఖ్యాత చేసిన వివరణకు తన వివరణను లేఖకుడు చేర్చుట,

10)మూలమునలేని నిఘంటు వ్యాకరణసమర్ధనలను చొప్పించుట, 11)మూలమునకు పొసగని పాఠములను చొప్పించుట. లేఖకులు తమకు నచ్చినట్లు వ్రాయుటే ఈ భ్రంశములకు కారణము. ఈ ప్రమాదములను దాటి కావ్యమైనను వ్యాఖ్యయైనను సుస్వరూపముగ శతాబ్దముల కాలవాహినినీది నిలిచియుండుట దురూహ్యము. కనుక అందినపాఠముల మంచి చెడులను ముచ్చటించునపుడు ఈ లేఖక దోషములను విస్మరించరాదు. ఏలన, ప్రాచీన గ్రంథముల పాఠములు లేఖకుల ద్వారముననే తరువాతి తరములకు లభించుట సాధారణానుభవము.

**మల్లినాథుడు :**

కాళిదాసుని వ్యాఖ్యాతలలో ప్రసిద్ధుడు మల్లినాథుడు. తన వ్యాఖ్య **కువ్యాఖ్యా విషమూర్ఛితయైన కాళిదాస భారతిని** ఉజ్జీవింపజేయుగాక యను నాశయముతో **సంజీవినీ** అని నామకరణము జేసినవాడు. వీనికి **సూరి** అను బిరుదున్నది. ఈతడు స్వయముగ బహుగ్రంథకర్త.

మల్లినాథుడు పండితకుటుంబములోని వాడు. ఈ కుటుంబమువారు వేదపండితులు, శాస్త్రపండితులు, యజ్వలు. మల్లినాథుని తండ్రి శ్రౌతశాస్త్రకారికను రచించిన విద్వాంసుడు. వాని కుమారుడైన కుమారస్వామి ప్రతాపరుద్రీయమునకు వ్యాఖ్యను రచించెను. మల్లినాథుడు స్వయముగ తనను గురించిగాని తనవారిని గురించిగాని తన రచనలలో ప్రస్తావించనే లేదు. వాని కుటుంబమును గురించి సాధికారత నిర్వివాదము కాదు. వాని తండ్రిపేరు కపర్దియని ఒక కొంత ఆధారమున్నది.

ఈతడు దేశపు దక్షిణాగ్రమున కన్యాకుమారి చెంతనున్న ఒకానొక గ్రామపు వాడని ఒక వాదము. కర్ణాటక రాష్ట్రమునగల గ్రామము వాని స్వగ్రామమని మరియొక వాదము. వాని పేరు మల్లినాథుడు కదా, మరాఠీ భాషలో మల్లినాథి అను పదమునకు వ్యాఖ్య, విమర్శ అని అర్థము కదా, కనుక ఈతడు మహారాష్ట్రము వాడని మూడవ వాదము. ఈ గందరగోళమును ఛేదించుచు పరిశోధనలో స్పష్టమైన సత్యము, ఈతడు తెలుగు వాడనియు, వీనిది నేటి మెధక్ జిల్లాలోని పఠాన్‌చెరు సమీపమునగల నేటి కొల్చారం అను గ్రామమనియు, ఇది ఆనాడు కొలిచెలమ అని పిలువబడెడిదనియు, ఇదియే సంస్కృతీకరించబడి, మల్లినాథుని ఇంటిపేరుగా కోలాచల అని యైనదని. అందువలన ఈతడు కోలాచల మల్లినాథసూరియైనాడు కాని నిజముగ నీతడు కొల్చారం మల్లినాథుడే. సూరి అనగ పండితుడని అర్థము అది వీని బిరుదు. ఇదిగాక వీనికి మహామహోపాధ్యాయ అను బిరుదమును, వ్యాఖ్యానచక్రవర్తి అను బిరుదమును కలవు.



ఈతడు క్రీ.శ. 1350-1450 మధ్య గల కాలమున జీవించి యుండెనని చారిత్రకాధారములున్నవి. విజయనగరము నేలిన 1వ దేవరాయలు కాలమువాడు. కాకతీయుల పాలన అంతరించిన తరువాత ఈతడు రక్కొండరాజైన సింగభూపాలుని ముఖ్యపట్టణమైన రాజకోనకు వలస వెళ్ళెనట. వీని విద్యాభ్యాసవిషయమున జానపదగాథలే తప్ప వేరు ఆధారము లేదు. ఒక కథననుసరించి మల్లినాథుడు కడు మందబుద్ధి. కాని వాని భార్య విద్యావతి. వివాహానంతరమొకనాడు ఆతడు ఊరి ఏటిలో స్నానము చేయుచు ఒడ్డున నిలచిన భార్యపైకి నీటిని చిమ్మగా ఆమె **మోదకైస్తాడయ** అన్నదట. ఆనాడు విఘ్నేశ చతుర్థియైనందున కుడుములు చేసి ఉన్నవి కనుక ఇంటికి వెళ్ళి కుడుముల తెచ్చి వానిని ఆమెపై విసరజొచ్చెనట. ఆమె చకితురాలై ఇదేమి యనగా, **మోదకైస్తాడయ** అంటివికదా, ఇవి మోదకములు, ఇది తాడనము అని నవ్వుచూ విసరెనట. ఆమె కోపమున **మా_ఉదకైస్తాడయ** అని నేనగా ఈ పాటి తెలియకపోయెనా అని నవ్వెనట. ఆ మాత్రము తానెఱుగనందుకు చింతించి ఆ రాత్రికి ఎవ్వరికీ చెప్పక బయలుదేరి కాశీనగరము జేరి అచట నొక పండితునాశ్రయించి మహాపండితుడై తిరిగి వచ్చెనని ఒక కథ. ఆతడు తన ఊరి చెంతనున్న ఒక సన్న్యాసిని సేవించుచుండెననియు, ఒకనాడాతడు తన తమ్మునకా సన్న్యాసిసేవనప్పగించగా, పెద్దిభట్టను నాతడు ఆ సన్న్యాసిని సేవించెననియు, కొంతకాలమునకు ఆ సన్న్యాసి కవసానకాలము రాగా పెద్దిభట్టునకొక మంత్రమునుపదేశించి, ఆ మంత్రోపాసన ఫలమును తన అన్నయగు మల్లినాథునకు ధారపోయవలయునని చెప్పి వానిచే అట్లే ప్రమాణము చేయించికొని మరణించెనట. మంత్రోపాసనచే పెద్దిభొట్టు మహాపండితుడై, మల్లినాథుని పేరున పెక్కు రచనలు చేసెనని మరియొక కథయున్నది. పేరే తప్ప అసలు మల్లినాథుడను వ్యక్తి లేనేలేడని ఒక వాదము.

మల్లినాథుని తండ్రిగా చెప్పబడుచున్న కపర్ది రచనలుగా 1.ఆపస్తంబ గృహ్యసూత్రవ్యాఖ్య, 2.భారద్వాజ గృహ్యసూత్ర వ్యాఖ్య అనునవి ముఖ్యములు. మరికొన్ని శాస్త్రగ్రంథములు కూడా కలవందురు.

మల్లినాథుని వ్యాఖ్యలు రెండు విధములు, కావ్య వ్యాఖ్యలు, శాస్త్ర వ్యాఖ్యలు, అని. **సంజీవినీవ్యాఖ్య** పేరున కాళిదాసుని రఘువంశ, కుమార సంభవ, మేఘదూత కావ్యములకును; **ఘంటాపథము** పేరున భారవికృత కిరాతార్జునీయమునకు వ్యాఖ్యయును; **సర్వంకషము** అను పేరున వ్రాసిన మాఘకావ్యవ్యాఖ్యయు; **జీవాతువు** పేరున వ్రాసిన శ్రీహర్షుని నైషధీయ చరితమునకు వ్యాఖ్యయు; **సర్వపథీనము** అను భట్టి కావ్యవ్యాఖ్యయు, ఏకావళికి చేసిన వ్యాఖ్య; **నిష్కంటకము** అను పేరున వరదరాజుని తార్కికరక్ష టీక; ఇవి వీని శాస్త్రవ్యాఖ్యలు. ఇవికాక ఇతడు రఘువీర చరిత్రము, వైశ్యవంశసుధాకర;

ఉదారకావ్యము అను మూడు సృజనాత్మక కృతులను రచించినట్టు తెలియవచ్చుచున్నది.

**రామోరా :**

ఈనాటి కాళిదాస వ్యాఖ్యాత రామోరా, విలోమమున గూడ నిర్వికారనామధేయుడు. వీని పూర్తిపేరు రావి మోహనరావు. ఈతని జననము క్రీ.శ. 1954లో గుంటూరు జిల్లాలోని వట్టిచెరుకూరు అను గ్రామమున. తల్లి శీతారామమ్మగారు; తండ్రి వేంకట సుబ్బయ్యగారు. విద్యాభ్యాసము చీరాల (నేటి ప్రకాశము జిల్లా) లోని వి.ఆర్.యస్. అండ్ వై.ఆర్.ఎన్. కళాశాలలోను, ఆంధ్రవిశ్వవిద్యాలయమునను. ఆపై చీరాలలో తాను చదివికొనిన కళాశాలయందే భూగర్భశాస్త్రమున ఉపన్యాసకుడై విశ్రాంతుడైన **శాస్త్రవిషయామతిః** అనదగినవాడైనను, వీని జీవన జీవమునకు పరమార్థము మాత్రము సనాతన సంస్కృత సాహిత్యాధ్యయనము. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి, వారి ఎమ్.ఎ పట్టమును సంస్కృతమున సాధించి నిర్విరామ పరిశ్రమ చేయు సాహిత్యకృషీవలుడు.

భారతదేశమున కావ్యాధ్యయనము ద్వారా భాషాధికారమును సాధించు పద్ధతి సాంప్రదాయికమే. రామోరా జీవలక్షణమైన శాస్త్రాధ్యయన దృష్టికి ఇది సరిపోయినది. **ఘటకర్పరకావ్యము**తో మొదలిడి, **ఋతు సంహారము, మేఘదూతము, కుమార సంభవముల**ను వ్యాఖ్యానించి, లబ్ధప్రతిష్ఠుడై, ఇప్పుడు పంచకావ్యాధ్యయన పరిపూర్తికై **రఘువంశమును** వ్యాఖ్యానింపబూనినాడు. ఇప్పటికి రెండు సర్గలను వ్యాఖ్యానించుటయైనది. ఇవికాక, పునర్ముద్రణకు నోచని చాల గ్రంథములకు పండితులచే వ్యాఖ్యలు వ్రాయించి ముద్రాపణమును నిర్వహించి, సరస్వతీకటాక్షము తనపై నిలిచియుండునట్లు హార్దికారాధనము చేయుచు, ప్రస్తుతమున ఖడ్గమాలా ముద్రాపణ కార్యమున నున్నవాడు రామోరా. ఈతడు తన వ్యాఖ్యను కాళిదాసకవితను బ్రతికించుటకు కంకణము గట్టికొని వ్రాయలేదు. పాఠకుల కింతమాత్రము తెలియకుండునా అని చెప్పవలసిన వానిని చెప్పక విడువనూ లేదు. ఒక విద్యార్థి భావమును పొంది, తోటి సంస్కృత విద్యార్థులకు ప్రయోజనకారిగా నుండుటకు సంస్కృత విద్యావ్యాప్తి నొక ఆశయముగ గ్రహించి చేసినదీ వ్యాఖ్య. దోషదృష్టులకిందు వెదకిన దొరుకునది: పూర్వకవి ప్రయోగములను, నిఘంటు ప్రమాణములను చూపు తరి ఒండు రెండుదాహరణములు చాలుగదా ఇన్నిన్ని పద్యముల పూర్తి పాఠములను వ్రాయుటెందులకు? అను మాట యొక్కటి. ఒకవేళ ఇది దోషమేయైనను ఇందొక గుణమున్నది. చాలమంది పాఠకులెఱుగని ప్రశస్త పద్యములను చదువు నవకాశమును పొందగలుగుదురు; ప్రయోగవైవిధ్యమును గుర్తించి విద్యార్థి పుష్టినొందగలుగును.





రామోరా తన వ్యాఖ్యకు **మృణాళినీ** యని నామకరణము చేసెను. శ్రీయోగి అరవిందులపై భక్తితో, వారి పత్నియైన మృణాళినీదేవిపై ప్రత్యయముతో, ఆమెను స్మరించి ఈ పేరుంచెను. ఈ మృణాళినీ వ్యాఖ్య ఒక ఏకాదశదళ పద్మము. ఇది మానవశరీరము వలె సురూపము సమగ్రమునైన ఏకాదశావయవి. ఆ అవయములివి: 1.పదవిభాగము, 2.అన్వయక్రమము, 3.ప్రతిపదార్థము, 4.తాత్పర్యము, 5.విభక్తులు–క్రియలు, 6.సమాసములు, 7.సంధులు, 8.పదవ్యుత్పత్తి–నిఘంటుప్రమాణములు–కావ్య ప్రయోగములు, 9.క్రియాదర్శము, 10.అలంకారములు, 11.ఛందస్సు. ఈ సరళిలో కవి ఏ శబ్దము నే విభక్తిలో ప్రయోగించెనో, ఆ విభక్తిలో దాని అన్యవచనరూపములను; ఏ ధాతువు నేలకారమున ప్రయోగించెనో ఆ లకారమున ఆ పురుషలోని అన్యవచనరూపములను ప్రదర్శించెను. సంధిని విఱిచి, ఏ సంధియో నిర్వచించి, వ్యాకరణ సూత్రమును ఉట్టంకించెను. క్రియాదర్శమున క్రియను విశ్లేషించి, ధాతువును నిర్ణయించి, ప్రయుక్తరూపమును, రూపసాధన, కర్మణి రూపమును, అన్యకవి ప్రయోగములను ఉదహరించెను. అలంకారము నిర్దేశించి, లక్షణము జెప్పి, వివాదముల పరిశీలించి నిర్ధారించెను. ఛందోలక్షణమును విశదీకరించి, వృత్తమును చెప్పెను. **సంస్కృత విద్యార్థులకిది చేతికందిన స్వాదుఫలము. విద్యాధికులకిది హృదయానందకరము.**

**5. కావ్యము:–**

కావ్యము కేవలమొక పనిలేని వాని కాలక్షేపమునకై వ్రాయబడదు. వ్రాయు వానికి, పాఠకునకు, తద్ద్వారా సమాజమునకు ప్రయోజనమును చేకూర్చు ఉద్దేశముతో కావ్యరచన పూర్వము జరిగినది, ఎప్పుడును జరుగవలసి యున్నది. ఏమా ప్రయోజనమనగా, వ్రాయువానికి, లౌకికజీవనమునకై ధనము, ఆత్మతృప్తికై యశస్సు లభించును. పాఠకునకు వ్యవహారజ్ఞానము లభించును. అనగా, లోకము తీరుతెన్నులెట్లున్నవో, అవి ఎట్లుండిన శ్రేయస్సు కలుగునో తెలిసికొను అవకాశము దొరకును. కాగా వ్యక్తి నిష్ఠమైనవి, సమాజనిష్ఠమైనవి అమంగళకరమైన రీతులు ఏమున్నవో తెలిసికొనుటవలన శివేతరక్షతి కవకాశము కలుగును. ఈ లాభము రచయితకు, పాఠకునకు, సమాజమునకు గూడ కలుగును. వ్యక్తిగతముగ పరనిర్వృతికి మార్గమేర్పడును. ఇది కావ్యమువలన ఉద్దేశింపబడిన ప్రయోజనము. విద్యార్థులకు కావ్యపఠనమువలన భాషాధికారము, భావశుద్ధి, శాస్త్రపరిజ్ఞానము, యుక్తాయుక్త వివేచనము కలుగును. దీనివలన సమాజజీవనము సంస్కారవంతము, శాంతియుతము, అన్యోన్య సహకారరూపము, ఆనందమయము కాగలదు. తన కావ్యము ద్వారా ఈ లక్ష్యమును సాధించుట కవి బాధ్యత. ఇట్లాతడు సమాజ ఋణము నుండి ముక్తుడు కాగలుగును.

కవికి వలెనే కావ్యమునకు శరీరము, మనస్సు, ఆత్మ ఉన్నవి. భాషావ్యాకరణములు, ఛందోలంకారములు ఇత్యాది శాస్త్ర సంబంధులు కావ్యశరీరమున వచ్చును. ఇది స్థూలము. ఇతివృత్తము, సన్నివేశములు, పాత్రలు, వాని సుఖదుఃఖములు, ఇవియన్నియు కావ్యమనోన్మీలనములు. ఈ రెండింటిని కలిపి చైతన్యవంతముజేయు కేంద్రకమైన పరమార్థమేదో అది కావ్యాత్మ. ఈ కావ్యాత్మ ప్రత్యక్షముగను పరోక్షముగను పరమాత్మ సంబంధి. కానిచో కావ్యము ఆనందమున పర్యవసించుట అను ప్రయోజనము సిద్ధించదు. ఈ కావ్యానందము బ్రహ్మానంద సహోదరము అనుదానికాధారమే ఉండదు. కవియొక్క కావ్యవ్యక్తికి గూడ ఇవి యన్నియు ప్రతిబింబములు. కనుక కావ్యార్థమును తెలియుటయనగా కవి హృదయమనోధర్మములను, ఆత్మసంస్కారమును తెలియుటే. దీనిని పదిమంది రసలుబ్ధులకు పరిచయము చేయుబూనువాడు వ్యాఖ్యాత. తొలిపరిచయము శరీరము, రూపురేఖలతోనే కదా. ఇదియే భారతీయ సాంప్రదాయిక వ్యాఖ్యారీతి. కావ్యాంతర్గతుడైన కవి ముఖాముఖి పరిచయము ఈ వ్యాఖ్య.

పాఠకులందఱు ఒక తీరువారు కారు. ముఖపరిచయము చాలుననువారు కొందఱు, శిరఃకంపనమాత్ర స్నేహము (nodding acquaintance) చాలుననువారు పెక్కురు, కరచాలనముతో తృప్తి పడువారు కొందఱు, ఆలింగనమైత్రిని కోరువారు మరికొందఱు, గాఢమైన సఖ్యమును పెంపొందించుకొని, కవి గుణదోషములనెఱిగి, వాని సుఖదుః ఖములలో తాదాత్మ్యము చెందగల పరమమిత్రులు కొందఱుందురు. ఈ ప్రగాఢతరమైత్రిని కలిగింతుమని పూర్వ వ్యాఖ్యాతలు చెప్పుటలేదు. దైహిక పరిచయము మేము కలిగింతుము, ఆత్మీయత సాధించుట పాఠకుని వంతు, అని వారి ఉద్దేశము. ఏలన ఎవరెవరి మైత్రి ఎంత చిక్కటి పాకమున బడునో, అది ఆత్మనిష్ఠమైన విశేషము. పరిచయకర్త దానికి బాధ్యుడు కాడు. అందులకే పూర్వ వ్యాఖ్యాతలు కొన్ని విశేషములను తడవక విడిచిరి. కాని, కొందఱు పాఠకులకైనను కొన్ని విశేషాంశముల చర్చ యుండిన బాగుండు ననిపించుట కద్దు. ఉదాహరణకు 1)భావనిర్మితికి పదప్రయోగమునకు గల ఆత్మీయత, 2) భావమునకు అలంకారమునకు గల భూషణ భూష్యభావము, 3)పురాణకథా ప్రసంగావసరము, 4)సంస్కృతీ విషయ విపులీకరణము, ఇత్యాది అంశములు. ఇట్టి విషయములలో వ్యక్తిగతమైన అభిరుచుల పాత్ర మిక్కిలిగనుండును. కనుక దానిని విడుచుట మేలనిపించుట సహజము.

రామోరా అధ్యయనము చేసిన ప్రస్తుత కావ్యము కాళిదాసుని రఘువంశము. దీనిని కుమారగుప్త చక్రవర్తి కోరికపై కాళిదాసుడు వ్రాసెనని, శ్రీలంకలో లభించిన ఒక శాసన మాధారముగ, సోహానీ గారు తమ పరిశోధన వ్యాసమున ప్రకటించిరి. ఈ



మహాకావ్యమున మనకు లభించినవి 19 సర్గలేయైనను, కాళిదాసుడంతకంటె ఎక్కువ సర్గలతోనే రచించెననుటకు కొన్ని ఆధారములు పరిశోధకులకు కన్పించినవి. 19వ సర్గను పరిశీలించినచో, కవి తన కావ్యమును ఆ సర్గతో ముగించదలపలేదనిపించును. కాగా, యస్.వి.పండిత్ గారు రఘువంశము మొత్తము 25 సర్గల మహాకావ్యమనియు, వి.వి. మిరాషిగారు 26 సర్గలనియు అభిప్రాయపడిరి. ఈ పైగల 6 లేక 7 సర్గలు లభించకపోవుటకు కారణము తెలియదు. వానిని అసలు రచించనేలేదనుటకు, రచించదలచినట్లు 19వ సర్గయే సాక్ష్యమిచ్చును. ఐన, రచించదలచిన ఆ సర్గలను కాళిదాసుడు తన వార్ధక్యము, శక్తిక్షీణత ఇత్యాదుల కారణమున రచించలేక విడిచినాడని ఒక ఊహ. లభించిన ఆధారములను బట్టి రఘువంశమే కాళిదాసుని చివరి రచన.

ఒక మహాకావ్యమును వ్రాయుమని కాక, కుమారగుప్తుడు రఘువంశచరిత్రమునే వ్రాయుమని నిర్దేశించి పలుకుటేమి!? ఈ కారణము మనకు లభించకపోయిన సర్గలలో నిక్షిప్తమైనదని ఒక ఊహ. అదేమనగా, కుమారగుప్తుడు తన తల్లివంక ఇక్ష్వాకువంశ బంధువట. ఈ చరిత్రకు సంబంధించిన కథ ఆ లభించని ఆరేడు సర్గలలో ఉన్నదట. ఇది సరియైన, కాళిదాసుడట్లే ఈ మహాకావ్యమునకు ముక్తాయి పలికియున్న, రాజరక్షణలో కావ్యము సమగ్రముగ మిగిలి యుండదా? కుమారగుప్త వంశ చరిత్రతో పొందికయున్న ఆ ఆరేడు సర్గలే నామరూపములు లేకుండ పోవుటకేమి కారణము?! తెలియదు.

రఘువంశ చరిత్ర నేడు పురాణకథా విశేషముగ ఎంచబడుచున్నను, ఆనాడది చరిత్రయే కదా! ఐన, కాళిదాసుడు ఈ పురాతన చరిత్రకాంశములను ఎక్కడ నుండి గ్రహించెను? ఈ ప్రశ్నకు కాళిదాసుడిట్లనును **(ర.వం.1.4)**

**శ్లో॥ అథ వా కృతవాగ్ద్వారే వంశే౽స్మిన్పూర్వసూరిభిః।**
**మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః॥**

పూర్వసూరులనగా కాళిదాసునకు పూర్వులైన వాల్మీకి వ్యాసులు. రఘువు ఇక్ష్వాకువంశము వాడు కనుక, ఆ చరిత్ర వ్రాసినది వాల్మీకి కనుక ఆతని రచనయే కాళిదాసునకు మూలాధారము, అనుకొనవచ్చును. కాని, కాళిదాసుడు **కవియశఃప్రార్థీ** అని, తాను కవినని చెప్పికొన్నాడు తప్ప చరిత్రకారుడనని చెప్పికొనలేదు. కనుకే వాల్మీకి రచనయే కాక అన్యత్రకూడ విషయసేకరణ చేసెను. కాళిదాసుడు తన కావ్యమును రఘువంశమునకే పరిమితము జేసెను, మొత్తము ఇక్ష్వాకువంశీయుల గురించి వ్రాయనెంచలేదు. దిలీపుడు వరమడిగినది, **వంశస్య కర్తారమనన్తకీర్తిం సుదక్షిణాయాం తనయం (ర.వం.2.64)** అని కదా.

ఈ మహాకావ్యమనూహ్యముగ 19వ సర్గతో, అనగా, అగ్నివర్ణునితో ఆగిపోయినది. అప్పటివరకు రఘువంశచరిత్రలో గణుతికెక్కిన మహోదాత్త చరిత్రులను వర్ణించిన కాళిదాసుడు ఈ అగ్నివర్ణుని వృత్తాంతము నేల వారితో చేర్చెను? అగ్నివర్ణుడు నైతికముగ పతితుడైన రాజుకదా! ఉత్తముల వరుసలో ఈ పతితుని చేర్చుట వలన ఔచిత్యభంగము కలుగును కదా! ఇందువలన ఈ మహాకవి సాధించదలచిన మహత్ఫలమేమి?

**రఘూణామన్వయం వక్ష్యే,** అనిన కాళిదాసుడు దానికి తన కారణమును గూడ, **తద్గుణైః కర్ణమాగత్య,** అని స్పష్టముగ చెప్పెను. అట్లే, తనను ఆకర్షించిన ఆ సుగుణములను **రఘువంశ ప్రథమసర్గ శ్లో 5-8 శ్లోకములలో** వివరించినాడు. కాగా, ఆ ఉదాత్తచరితు లందఱును తమ జీవితములను సంస్కరించికొని అర్థకామములను ధర్మముతో నియంత్రించి మోక్షలక్ష్మిని చేకొన్నవారని విపులముగ వర్ణించెను. కాని ఈ కావ్యపాఠకునకు కాళిదాసుడు చెప్పనెంచిన అంశము మరియొకటున్నది. అదేమనగా, ఆ నియంత్రణము లేని విశృంఖల భోగపరాయణత స్వరూపమెంత వికృతమో, భయంకరమో, దానిని గూడ సజీవముగ చూపనెంచెను. ఇట్టిది ఉద్దిష్టప్రయోజనమే తప్ప కాకతాళీయమో, అశ్రద్ధకు ఫలితమో కాదు.

రఘువంశ కావ్యమున విశేషముగ వర్ణింపబడినది దిలీపుని చరిత్రము. కాని ఆ వంశమున ఇద్దరు దిలీపులుండగా, వారిలో కావ్యగత దిలీపుడు మొదటివాడా లేక రెండవ వాడా? అనునది వివరింపబడలేదు. రెండవ దిలీపుడు రఘువునకు కాలక్రమమున దగ్గరివాడు కనుక ఆతడే కావచ్చునని అభిప్రాయము.

కాళిదాసుడు తన ప్రణాళికకు అనుకూలముగ ఇక్ష్వాకు వంశీయుల ఆనుక్రమమున కొందఱురాజులను చెప్పక విడిచెనని పరిశోధకుల అభిప్రాయము. రఘువంశము కావ్య రూపమునగల ఒక భారతీయ రాజనైతికశాస్త్రము. శ్రద్ధగా, ప్రణాళికాబద్ధముగా కాళిదాసుడు దీనిని రచించెను. శివేతరక్షతికి, పరనిర్వృతికి సమర్థమైన మహాకావ్యమిది. కనుకే ఈ కావ్యాది భగవత్ప్రార్థన వాగర్థప్రతిపత్తిని, అనగా కావ్యమూలమున శివేతరక్షతిని, పరనిర్వృతినికోరుచూ కన్పడును.మరి యే శ్రవ్యకావ్యాదిలో భగవత్ప్రార్థన కనరాదు కదా!

**- చింతగుంట సుబ్బారావు**





పీఠికను అందించిన

శ్రీ చింతగుంట సుబ్బారావుగార్కి

ప్రోత్సహించిన డా॥ ముళ్లపూడి విశ్వనాథశాస్త్రిగార్కి, శ్రీ మేళ్ళచెఱ్ఱువార్కి, డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావుగార్కి, శ్రీ దేశం పాపిరెడ్డిగారికి

నమస్సులు.

**ఎందరో మహానుభావులు, అందరికీ వందనాలు.**

- రామోరా

శ్రీః
రఘువంశః – ద్వితీయఃసర్గః

**విషయసూచికా**







अइउण्, ऋऌक्, एओङ्, ऐऔच्, हयवरट्, लण्, ञमङणनम्, झभञ्, घढधष्, जबगडदश्, खफछठथचटतव्, कपय्, शषसर्, हल्

శ్రీః

# రఘువంశః

## 'నందినీవరప్రసాదో' నామ ద్వితీయః సర్గః



**అవతారిక :–** ప్రభాతే రాజా ధేనుం వనాయ విససర్జ।

**శ్లో॥** **అథ ప్రజానామధిపః ప్రభాతే**
**జాయాప్రతిగ్రాహితగన్ధమాల్యామ్।**
**వనాయ పీతప్రతిబద్ధవత్సాం**
**యశోధనో ధేనుమృషేర్మమోచ ॥** **1**

**श्लो॥ अथ प्रजानामधिपः प्रभाते**
**जायाप्रतिग्राहितगन्धमाल्याम्।**
**वनाय पीतप्रतिबद्धवत्सां**
**यशोधनो धेनुमृषेर्मुमोच॥** **१**

**పదవిభాగము :–** అథ, ప్రజానామ్, అధిపః, ప్రభాతే, జాయా…మాల్యామ్, వనాయ, పీతప్రతిబద్ధవత్సామ్, యశోధనః, ధేనుమ్, ఋషేః, ముమోచ।

**అన్వయక్రమము :–** అథ యశోధనః ప్రజానామ్ అధిపః ప్రభాతే జాయా…మాల్యాం పీతప్రతిబద్ధవత్సామ్ ఋషేః ధేనుం వనాయ ముమోచ।

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, యశోధనః = కీర్తియే సంపదగాగల, ప్రజానామ్ – అధిపః = ప్రజలకు అధిపతియగు దిలీపుడు, ప్రభాతే = వేకువజామునందు, జాయా ప్రతిగ్రాహితగంధమాల్యామ్ = భార్యయగు సుదక్షిణాదేవిచే స్వీకరింపబడిన చందన





పుష్ప మాలలు కలదియు, పీత – ప్రతిబద్ధ – వత్సామ్ = పాలు త్రాగినదై కట్టివేయబడిన దూడకలదియు అగు, ఋషేః ధేనుమ్ – వసిష్ఠమహర్షియొక్క ఆవును, వనాయ = అడవికొఱకు, ముమోచ = విడచెను.

**తాత్పర్యము :–** పిమ్మట కీర్తిశాలి, ప్రజలకు అధిపతియగు **దిలీపుడు**, వేకువజామునందు సుదక్షిణాదేవిచే స్వీకరింపబడిన చందన పుష్పమాలలు కలదియు, పాలుత్రాగినదై కట్టివేయబడిన దూడకలదియు అగు వసిష్ఠమహర్షియొక్క **ఆవును** అడవికి పోవుటకు విడచెను.

**విభక్తులు / క్రియలు :–** 1. అథ – అవ్యయమ్; 2.ప్రజానామ్ – ప్రజాయాః, ప్రజయోః, **ప్రజానామ్**; ప్రజాశబ్దః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, షష్ఠీబహువచనాన్తః। 3. అధిపః – **అధిపః**, అధిపౌ, అధిపాః; అధిపశబ్దః, అకారాన్తః, పుల్లిఙ్గః, ప్రథమైకవచనాన్తః। 4. ప్రభాతే – **ప్రభాతే**, ప్రభాతయోః, ప్రభాతేషు; ప్రభాతశబ్దః, అకారాన్తః, నపుంసకలిఙ్గః సప్తమ్యేకవచనాన్తః। 5. జాయా…మాల్యామ్ – **…మాల్యామ్**, …మాల్యే, …మాల్యాః …మాల్యాశబ్దః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, ద్వితీయైకవచనాన్తః। 6. వనాయ – **వనాయ**, వనాభ్యాం, వనేభ్యః; వనశబ్దః, అకారాన్తః, నపుంసకలిఙ్గః, చతుర్థ్యేకవచనాన్తః। 7. పీతప్రతిబద్ధవత్సామ్ – **…వత్సామ్**, …వత్సే, …వత్సాః; …వత్సాశబ్దః, ఆకారాన్తః, స్త్రీలిఙ్గః, ద్వితీయైకవచనాన్తః। 8. యశోధనః – **యశోధనః**, యశోధనౌ, యశోధనాః యశోధనశబ్దః, అకారాన్తః, పుల్లిఙ్గః, ప్రథమైకవచనాన్తః। 9. ధేనుమ్ – **ధేనుమ్**, ధేనూ, ధేనూః; ధేనుశబ్దః, ఉకారాన్తః, స్త్రీలిఙ్గః, ద్వితీయైకవచనాన్తః। 10. ఋషేః – **ఋషేః**, ఋష్యోః, ఋషీణామ్; ఋషిశబ్దః, ఇకారాన్తః, పుల్లిఙ్గః, షష్ఠ్యేకవచనాన్తః। 11. ముమోచ – క్రియాపదమ్, ప్రథమపురుషైకవచనాన్తః, భూతేలిట్।

**సంధులు :–**

1. యశోధనః + ధేనుః – యశోధనో ధేనుః – ఉత్వాదేశః।
2. ఋషేః + ముమోచ – ఋషేర్ముమోచ – విసర్గసన్ధిః (రుత్వమ్)।

**సమాసాలు :–**

1. జాయాప్రతిగ్రాహితగంధమాల్యామ్ – గంధశ్చ మాల్యం చ – గంధమాల్యే (ద్వంద్వ), జాయయా ప్రతిగ్రాహితే, జాయాప్రతిగ్రాహితే; జాయాప్రతిగ్రాహితే గంధమాల్యే యయా సా, జాయాప్రతిగ్రాహితమాల్యా, (బహువ్రీహిః) తామ్।
2. యశోధనః – యశః ఏవ ధనం యస్య సః యశోధనః (బ.)।
3. పీతప్రతిబద్ధవత్సామ్ – పీతం అస్యాస్తీతి పీతః, పీతః ప్రతిబద్ధశ్చ వత్సః యస్యాః సా, పీతప్రతిబద్ధవత్సా, (బ.) తామ్।

